శ్రీ

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీముకుందశతకము.

ఇది

శ్రీమాన్,

నల్లంతిఘళ్ చక్రవర్తుల రంయాల లక్ష్మీనృసింహార్య

కవినాథునిచే రచియింపఁబడి

పండితపరిష్కారంబై

శ్రీవేంకటేశ్వరభక్తసమాజం వరంగల్ వారి

ద్రవ్య సహాయముచే

శ్రీమాన్ ప్రతాపం రామానుజాచార్యులవారి

శ్రీవేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రచురింపఁబడియె




వరంగల్.

1928.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

వెల రు 0-2-0.

శ్రీశ్రీసేనాపతి శఠరిపునాధముని పుండరీకాక్షా
రామంయామునపూర్ణౌ రామానుజమపి నమామిమద్గురుభిః॥

# విజ్ఞాపన.

మహాశయులారా!

ఈ శ్రీముకుందశతకమును ఆంధ్రకవితా విశారదుండును కవిజన తిలకుండునగు శ్రీమాన్ నలంతిఘళ్ చక్రవర్తి తంయ్యాల లక్ష్మీనృసింహాచార్యులవారు సత్సంప్రదాయవిషయమును "కట్టియిల్ మరందు శేర్తుకొడుత్తాప్పోలే" అన్నట్టు పద్యరూపమగు నీశతకంబులో జేర్చిరి, ఈ సంప్రదాయము నేసకల చేతనోజ్జీవనార్థంబుగా నాథయామున యతివరాది పూర్వాచార్యులును, అనేక విధగ్రంథములయందు పాదించినను అవి సంస్కృత ద్రావిడ రూపంబులుగా నుండుటవలన అల్పజ్ఞానులై యశక్తులైన చేతనులకు దురవగాహంబులుగా నుండుటంగని తేనెటీగయన్ని పుష్పములలోనున్న మకరందముంగని గొనివచ్చి యొకేతావునం జేర్చునట్లు వేదవేదాంతసారమైన శ్రీకృష్ణవిషయంబగునష్టోత్తరశత నామంబులను పద్యములలో నిమిడ్చి ప్రవచన స్మరణానుకూలంబుగా యొకేతావునచేర్చిరి. వీరీశతకంబునేగాక మరికొన్ని ప్రబంధములనుగూడ రచియించిరి. అమ్మహాప్రబంధ కవితాచాతురీమహిమ ప్రథమమున నాచే పేర్కొనబడిన ఈ కవి బిరుదులకన్వర్థనామకమనుట కెంతమాత్రము సందియములేదు. తత్ప్రబంధవిచిత్రవర్ణనాద్భుతములిట వ్రాయుటకు పుస్తకాధిక్యభీతిచే వ్రాయనైతిని, ఆ ప్రబంధముల నాసాంతము పఠించిన గుణగ్రహణధురీణులు వీరిని శిరస్సుచే శ్లాఘించకమానరు, వీరు సకల కవిజనాహ్లాదకర కవితాస్వంబు నొంది చరమమంత్రప్రదాతయగు శ్రీకృష్ణుని యష్టోత్తరశతనామంబులు పద్యములయందు చాలావరకు సంపూర్ణనామముల నిమిడ్చి శతకపూర్తి గావించి స్వీయభగవద్భక్తిపరవశత్వమును వెల్లడించిరి. ఇదిగాక యీ శతకమందు (నామైకదేశే నామగ్రహణ) మ్మనే న్యాయముననుసరించి కొన్ని స్థలములయందు నామములలో యేకదేశమె ప్రయోగింపబడినది. కావున చదువరులాయా పద్యములయందా న్యాయముననుసరించి నామముల గ్రహింతురుగాక! మరియు సకలలోక మోహనరూపుండగు శ్రీకృష్ణుని విషయంబులగు పద్యంబులుగాన నీ శతకంబును జదువు భక్తబృందము తత్శ్రీకృష్ణమోహావిష్ట మానసులై యిందలి నామ మాత్ర పఠనచే ఐహలౌకిక సుఖంబునుంబడయుచు తదనంతరంబున ముక్తి నొందుదురనుట నిశ్చయమేకదా? కావున గుణగ్రహణ ధురీణులగు పెద్దలు శ్లో॥ గుణదోషౌ బుధోగృహ్ణన్ ఇందుక్ష్వేళావివేశ్వరః, శిరసాశ్లాఘతే పూర్వం పరంకం

శేనియస్సృతి॥ అన్నట్లు శిరస్సుచే శ్లాఘింతురని నమ్ముచున్నాడను ఇంతియకాక నిష్మహోకపచే,

1. శుద్ధాంధ్రనిర్గ్రన్థ్య నిరోష్ఠ్య కేకయరాజనందనచరిత్ర.
2. అచ్చతెనుగు కుబ్జాకృష్ణవిలాసం.
3. నిరోష్ఠ్య కౌంతేయచరిత్ర.
4 నిర్వచన శుభాంగీకల్యాణము.
5. సౌగంధ్యాపహరణోపాఖ్యానం.

మొదలగు మఱికొన్ని గ్రంథములు రచియింపబడినవి, అట్టి గ్రంథరాజములచ్చు కాగల్గుటకు సహకార్యులగునటుల సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాడను.

ఇట్లు,

# ప్రతాపం రంగాచార్యులు.

విద్వాన్, ఇన్కమేత్, ఆఫ్ (శ్రీవైష్ణవ).

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౪ | ౧౬ | ౫ | నాగరశయ | సాగరశయ |
| ౩ | ౧౫ | ౧౮ | మధురక్షోంత | మధురక్షోహ |
| ౬ | ౩౯ | ౧౮ | అప్సరపూజిత | అప్సరసార్చిత |
| ౧౦ | ౫౮ | ౨౨ | బలకృష్ణులనగ | బలసహితుడవై |
| | | ౨౩ | కలితయశంబునను | కలితుడవైనట్టి |
| ౧౨ | ౭౫ | ౪ | జనునజి \| | జంఘుజి \| |
| ౧౪ | ౭౯ | ౧౨ | యా \| దిత్యజిత \| | యా \| దిత్యజయ |
| ౧౫ | ౮౩ | ౩ | కశిపవత్కు | కశిపవత్స |
| | ౮౪ | ౬ | కారణద | సంధాన |
| | | ౬ | ప్రపదా | ప్రపద)శ్రీ |
| | ౮౭ | ౧౪ | గోప్రముఖా | స్వప్రముఖా |
| ౧౬ | ౯౭ | ౬ | కామక్రోధాదిలోభకారణభేదా \| | కామాద్యరివర్గభేద కారణదేవా \| |
| ౧౯ | ౧౦౬ | ౨ | అప్రాప్తమనోరథద | అప్రాప్తవిషయవిషహ |
| | ,, | ౪ | సంభృత | పత్రిత |
| | | | జలదాక్షిద్విరదాబ్జసంఖ్యగతమెచ్చుక శాలివాహప్ల \| వంగలసన్మాధవ శుద్ధషష్ఠి వెుసెక | కలభత్రిణికరేందుశాలివహసంఖ్యక హెచ్చ పూర్ణించెమెల్ \| నలసన్మాధవశుద్ధపంచమిని శ్రీ |



శ్రీ



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ ముకుంద శతకము.




క॥ శ్రీకమలాకుచయుగ బా।
హ్లీం కాగురుచందనాది లిప్తరుచిర వ।
క్షా కలిత లోకనాయక।
(శ్రీకృష్ణా) వేల్పుగొండ సీమముకుందా॥ ౧

క॥ పరమపదనిలయ వామన।
కరిరాట్పరిపాలశౌరి (కమలానాథా)
కరిచర్మవసనసన్నుత।
చరణకమల వేల్పుగొండ శరణముకుందా॥ ౨

క॥ తర్షప్రదదితిసుతచయ।
హర్షభిదా (వాసుదేవ) హరనుత శ్రీసం।
కర్షణసత్యచరిత్రో।
ద్ధర్షా శ్రీవేల్పుగొండ ధామముకుందా॥ 3

క॥ పుష్కరదళసమలోచన।
౧పుష్కరమేచకశుభాంగ పురుషోత్తమ స।
న్నిష్కపట (సనాతన) భృత।
౨విష్కిరవర వేల్పుగొండ వేశ్మముకుందా॥ ౪

---

౧ మేఘ, ౨ గరుడ,

క॥ ప్రాచ్యధిపశమనవరుణో।
దీచ్యధిపతిమౌళిరత్న తేజోంఘ్రియుగా।
యచ్యుత (వసుదేవాత్మజ।
౧శుచ్యాస్యక వేల్పుగొండ శుభదముకుందా॥ ౫

క॥ హాస్తికులేశావనశ్రీ।
రస్తుశుభం తేసదాస్తు హరిహయముఖ దే।
వస్తుతపద (పుణ్యా) ధృత।
కౌస్తుభశ్రీవేల్పుగొండ కాంతముకుందా॥ ౬

క॥ న్యగ్రోధపత్రశయన స।
మగ్రకుశల గుణసమూహ మధితారిమహా।
విగ్రహ (లీలామానుష।
విగ్రహ) శ్రీవేల్పుగొండ వేశ్మముకుందా॥ ౭

క॥ అవ్యక్తరూపసద్గుణ।
భవ్య (శ్రీవత్సకౌస్తుభధరా) శార్ఙ్గీ।
నవ్యనవనీతచోరా।
దివ్యాపన వేల్పుగొండ ధిష్ణ్యముకుందా॥ ౮

క॥ పాశమునతల్లిరోటికి।
వేశమునఁగట్టఁ గూల్చి వేసితి కుజలన్।
శ్రీశ (యశోదావత్సల)
దాశార్హా వేల్పుగొండ ధామముకుందా॥ ౯

క॥ చిత్రమగులోకసృష్టి గు।
ణత్రితయమునస్రచించి నాథుడవైలో।
కత్రాసహారుడవైతివి।
పాత్రత(హరి) వేల్పుగొండ శరణముకుందా॥ ౧౦

---

౧ చంద్రముఖ,

క॥ ౧న్యాంఖచరిత్రాంచితగుణ।
శంఖాః(చతుర్భుజాత్త చక్రాసిగదా।
శంఖాద్యధాయుధా) ౨విప।
కంఖాణా వేల్పుగొండ కాంతముకుందా॥ ౧౧

క॥ కాశరుహాజనకసన్నుత।
కేశవవైకుంఠ (దేవకీనందన)యో।
గీశార్చితపదయుగ స।
ర్వేశా శ్రీవేల్పుగొండ వేశ్మముకుందా॥ ౧౨

క॥ స్వర్ణకలితపట (శ్రీశ) కృ।
పార్ణవపద్మావినోద హంసయశోదా।
తర్ణక సజలాంబుదసమ।
వర్ణా శ్రీవేల్పుగొండ వాసముకుందా॥ ౧౩

క॥ కుందముకుళరదనాముచి।
కుందవినుతపాద (నందగోపప్రేమాం।
నందన) నందయశోదా।
నందన శ్రీవేల్పుగొండ నాథముకుందా॥ ౧౪

క॥ మధురక్షోంతవినాయక।
రథ(యమునావేగసంహరా) మన్మథమ।
న్మథశుభగుణమంజూషా।
బుధనుతపద వేల్పుగొండ భూషముకుందా॥ ౧౫

క॥ గ్లాబింబసమముఖవిలా।
సా(బలభద్రప్రియానుజా) శౌర్యాది।
శ్రీబలవిక్రమధైర్య।
ప్రాబల్యా వేల్పుగొండ భవనముకుందా॥ ౧౬

౧ మనోహర, ౨ గరుడవాహన,

క॥ నాగాధినాథశయనా।
నాగాశనవాహ (పూతనాజీవితహా।
శ్రీ) గౌరీహృత్సంచర।
నాగరశయ వేల్పుగొండ శరణముకుందా॥ ౧౭

క॥ రంజకగుణ (శకటాసుర।
భంజన) దేవేంద్రగర్వ భంగమహాత్మా।
ఖంజనసదృశ శరీరా।
కుంజరనుత వేల్పుగొండ కూటముకుందా॥ ౧౮

క॥ అజపూజితపదయుగకమ।
లజలోచనదేవ హాతఖలనివహా *(నంద।
వ్రజజనమోదీ) సన్నుత।
విజయా శ్రీవేల్పుగొండ వేశ్మముకుందా॥ ౧౯

క॥ సుగ్రీవాగ్రజ హారవిహా।
తాగ్రహాకమలేశ (సచ్చిదానందలస।
ద్విగ్రహా) మన్మథసుందర।
విగ్రహా శ్రీవేల్పుగొండ వేశ్మముకుందా॥ ౨౦

క॥ లుప్తాఘా (నవనీతవి।
లిప్తాంగా) శశికులాబ్జ లేఖార్చిత శ్రీ।
సప్తాశ్వతేజ జలనిధి।
సుప్తా శ్రీవేల్పుగొండ సుపదముకుందా॥ ౨౧

క॥ ద్విట్తతిభామాహృత్కజ।
నిట్తతరుణీనాయక (నవనీతనటా)గ్లా।
త్విట్తుల్యాలపననాక గృ।
హేట్తరుణా వేల్పుగొండ యీశముకుందా॥ ౨౨

# శ్రీ ముకుందశతకము.

క॥ చంద్రాతపవజ్రశర ।
చ్చంద్రాబ్జమరాళహీర శంకరవృషదే ।
వేంద్రాశ్వసమయశాశ్రీ ।
సాంద్ర (యనఘ) వేల్పుగొండ సదనముకుందా॥

క॥ మోహనశరీర సజలవ ।
లాహకశుభవర్ణ కుశల లక్షణగుణసం ।
దోహవిమల (నవనీత న ।
వాహరా) వేల్పుగొండవాసముకుందా ॥

క॥ కామాద్యరిహరసుశ్లో ।
కా (ముచికుందప్రసాదకా) సుకుమారా ।
కామారిహృదయగతశుభ ।
నామా శ్రీవేల్పుగొండ నాథముకుందా ॥

క॥ ఈశ్వరభవభయమోచన ।
శాశ్వతగరుడాంక (షోడశస్త్రీసాహ ।
(సేశ్వర) సద్గుణభరగా ।
రీశ్వరనుత వేల్పుగొండ యీశముకుందా॥

క॥ కల్మషహారభవసంచయ ।
గుల్మలవిత్రా (త్రిభంగి) కోమలచరణా ।
వాల్మీకవినుతనాతరిపు ।
గుల్మా శ్రీవేల్పుగొండ కూటముకుందా ॥

క॥ దీర్ఘచతుర్భుజదేవయ ।
నర్ఘమణిస్థగితమకుట హాటకభూషా ।
దుర్ఘట (మధురాకృతి) ఘన ।
౧ఘుర్ఘుర శ్రీ వేల్పుగొండ కాంతముకుందా॥

---

౧ గంభీరధ్వని,

క॥ ప్రకటితసాందీపన్పుత్రా।
ర్భకదాయక దేవదేవ పావనచరణా।
శుకవాగమృతాబ్ధిచంద్రా।
శుకమునినుత వెల్పుగొండ సుపదముకుందా। ౨౯

క॥ కృష్ణా (గోవిందా) యని।
కృష్ణయు మొఱలిడఁగ సభను కృతినియమితయో।
కృష్ణా యాదవ వలువలు।
తృష్ణనిడితి వేల్పుగొండ గృహాపముకుందా॥ ౩౦

క॥ సువ్రతరూపాసంహృత।
తీవ్రవవా (యోగినాంపతీ) కాళియనా।
గర్వతతి ఫణానర్తక।
సువ్రజవర వేల్పుగొండ సుపదముకుందా॥ ౩౧

క॥ కల్యాణాత్మక శ్రీకా।
సల్యాత్మజ (వత్సవాటచర) సన్నుతసా।
శీల్యాభాస్కరసమజా।
జ్వాల్యాశ్రీవేల్పుగొండ వాసముకుందా॥ ౩౨

క॥ శంతనసుతుపై నల్లవ।
కాంతలపై విదురుపైనఁ గలిగినదయకా।
సంతైనఁజూపవేమి (య।
నంతా) శ్రీవేల్పుగొండ నాథముకుందా॥ ౩౩

క॥ మంజుగుణ (ధేనుకాసుర।
భంజన) గోపాంగనాశుభమనోబ్జలస।
త్కంజహిత శ్వేతవాహన।
యుంజానా వేల్పుగొండ యుటజముకుందా॥ ౩౪

క॥ ఉత్పలహిత సముఖాబ్జశ్రీ ।
తత్పరశౌరి (త్రైలోక్యప్రతత్పరావర్యా) ।
సత్పరిచిత పదనైగమ ॥
విత్పావన వేల్పుగొండ వేశ్మముకుందా॥ ౩౫

క॥ అర్జునసూతి వ్రజవర (యమ ।
ళార్జునభంజన) సనందనావనబహుజ ।
న్మార్జితకల్మషసంచయ ।
మార్జక శ్రీ వేల్పుగొండ మాన్యముకుందా॥ ౩౬

క॥ నుత్తభవదురితరాశీ ।
మత్తదనుజరాట్సాది మదకరిసింహా ।
(ఉత్తాలతాలభేత్తా) ।
విత్తపనుత వేల్పుగొండ వేశ్మముకుందా॥ ౩౭

క॥ కశ్యపతనయాసన్నుత ।
కశ్యపకరుణాసముద్ర కేనఃపట (తమా ।
లశ్యామలాకృతీ) వరద ॥
కైశ్యక శ్రీ వేల్పుగొండ కాంతముకుందా॥ ౩౮

క॥ అప్సరప్రార్థిత పూర్వక ।
కుప్సదనపరశు (గోపస్త్రీశ్వర) పూ ।
ర్ణాప్సహితాబ్జశరీరా ।
యాప్సితగుణ వేల్పుగొండ యాశముకుందా॥ ౩౯

క॥ మాండవ్యాదులు భృగుముని ।
శాండిల్యమూర్తిత్రయమున చక్రియు శ్రేష్ఠా ।
త్స్మండని (యోగీ) పొంచిరి ।
పాండవహిత వేల్పుగొండ భవనముకుందా॥ ౪౦

క॥ హర్యక్షశౌర్యసురగిరి ।
ధైర్యపయోనిధినివాస ౧దశరథ (కోటీ ।
సూర్యసమప్రభ) స్మరసౌం ।
దర్యా శ్రీవేల్పుగొండ ధామముకుందా॥ ౪౧

క॥ వితతముగ బలినిచరణ ।
త్రితయముయాచించి యాయతింగొల్చి (ఇళా ।
పతి) లోకములను నిండిన ।
మతిమంతా వేల్పుగొండ మాన్యముకుందా॥ ౪౨

క॥ ఆమ్నాయవేద్యజలనిధి ।
నిమ్న (పరంజ్యోతి) కృష్ణనిర్వాణద ప్ర ।
ద్యుమ్నానుతిపూతేంద్ర ।
ద్యుమ్నా శ్రీవేల్పుగొండ యోగిముకుందా॥ ౪౩

క॥ దూష్యారినిషూదనమా ।
నుష్యావన (యాదవేంద్ర) నూతనమణిసం ।
హృష్యన్మకుటవిరాజిత ।
శిష్యార్జున వేల్పుగొండ సీమముకుందా॥ ౪౪

క॥ కంధరమేచకనిభదర ।
కంధరపాపాంధకార ఖరకరవిలస ।
త్సింధుకభీర (యదూద్వహ) ।
బంధచ్ఛిద వేల్పుగొండ భవనముకుందా॥ ౪౫

క॥ వన్యేభావనకమలా ।
కన్యాహృదయాంబుజోష్ణకర (వనమాలీ) ।
జన్యాంతరరిపుహర సౌ ।
జన్యా శ్రీవేల్పుగొండ శరణముకుందా॥ ౪౬

---

౧ పక్షివాహ,

మాత్రీమణిహృద్ధర చ ।
క్రాన్త్రకరా (పీతవాస) హతశాత్రవస ।
ద్వంత్రకృపాకరపరిచిత ।
శాస్త్రాశ్రీవేల్పుగొండ సదనముకుందా ॥ ౪౭

॥ సర్గస్థితిలయకృన్నై ।
సర్గికగుణజాల (పారిజాతాపహరా)।
భర్గాఘనాశకాయప ।
వర్గప్రదవేల్పుగొండ వాసముకుందా ॥ ౪౮

ఉద్ధవబోధాచార్యకృ ।
పోద్ధర(గోవర్ధనాచలోద్ధర్తా)శ్రీ ।
బద్ధానురాగ హరియని ।
రుద్ధాశ్రీవేల్పుగొండ రూఢముకుందా ॥ ౪౯

అడ్డులనుగడియొకడా ।
యడ్డులతో వెడలునీటి నొదలనింకక ।
దొడ్డియొకడు(గోపాలా) ।
వడ్డమనిరి వేల్పుగొండవాసముకుందా ॥ ౫౦

ఉగ్రాప్త (సర్వపాలక) ।
సుగ్రావధరావిలా శోభితభక్తా ।
నుగ్రహకరజిత ను [illegible] ధ ।
విగ్రహశ్రీవేలు [illegible] వేశ్మముకుందా ॥ ౫౧

దుర్భరదనుజ [illegible] ।
గర్భచ్ఛేదకక [illegible] ననిస్వానగో ।
పార్భకసేవితపద [illegible])।
నిర్భరగుణ వే [illegible] నిలయముకుందా ॥ ౫౨

క॥ పుణ్యావనభూనివృతహి ।
రణ్యాక్షప్రాణహర వరాహశరీరా ।
మణ్యాభరణ నిరంజన ।
పుణ్యాత్మక వేల్పుగొండ భూషముకుందా॥ ౫౩

క॥ ఆర్యనుత (కామజనకా) ।
మర్యాదస్థాపకార్య మానవరక్షా ।
స్థైర్యాసరస్థితిలయ ।
కార్యకరా వేల్పుగొండ కాంతముకుందా॥ ౫౪

క॥ మంజులశుభకర గుణచయ ।
పుంజీభూతావతార బుధజనగణహృ ।
త్కంజరవి (కంజలోచన) ।
కంజచరణ వేల్పుగొండ కాంతముకుందా॥ ౫౫

క॥ విఘ్నాధిపనుత పాద (మ ।
ధుఘ్నా) గరుడధ్వజాంక దుగ్ధాబ్ధిశయా ।
విఘ్నాపహ శౌరిప్రలం ।
బఘ్నానుజ వేల్పుగొండ భవనముకుందా॥ ౫౬

క॥ (మధురానాథా) వల్లవ ।
పృథుకావన సర్వపూర్ణ విశ్రుతకీర్తీ ।
మధుమథన సకలచిదచి ।
త్పృథమా శ్రీవేల్పుగొండ భవనముకుందా॥ ౫౭

క॥ బలకృష్ణులనగ మధురను ।
కలితయశంబునను (ద్వారకానాయక) నిన్ ।
దలచినవారల గాచితి ।
వలరగ శ్రీవేల్పుగొండ హర్మ్యముకుందా॥ ౫౮

క॥ గజనాయకసంరక్షక !
గజచర్మధరాంహోజాల ఖండననంద ।
వ్రజజనపాలక (బలి) పం ।
కజచరణా వేల్పుగొండ కాంతముకుందా॥ ౫౯

క॥ సన్న్యాసహృదయచరరా ।
జన్యా (బృందావనాంతసంచారీ)ధ ।
ర్మన్యాయమార్గ పావన ।
ధన్యా(శ్రీ వేల్పుగొండ ధామముకుందా॥ ౬౦

క॥ పాతకచయ కాననవ ।
హ్నా(తులసీదామభూష) యింద్రాదిసుర ।
వ్రాతమనోత్పలవికసిత ।
సీతకిరణ వేల్పుగొండ సీమముకుందా॥ ౬౧

క॥ కర్తాభీష్మకతనయా ।
భర్తాచరమప్రదాన భవహరలోకా ।
ధర్త(శ్యమంతకసుమణే ।
ర్హర్తా) (శ్రీ వేల్పుగొండహార్యముకుందా॥ ౬౨

క॥ అరిదరశార్ఙ్గాసిగదా ।
కర(నరనారాయణాత్మకా) వనమాలీ ।
కరినాయకరక్షక కం ।
ధరసుందర వేల్పుగొండధామముకుందా॥ ౬౩

క॥ ౧వృష్టికరతేజ(కుబ్జా ।
కృష్టాంబరధర) సముద్రగృహసంచారా ।
వృష్ణైకమానసాంబుజ ।
సృష్టికరా వేల్పుగొండ సీమముకుందా॥ ౬౪



---

౧ దినకర.

క॥ విష్వక్సేనా శార్ఙ్గా
ఖ్యేష్వాసనహస్త(మాయి)యిభవరదలస
౧ద్విష్వక్చరితాజఘనజి
తేష్వధి శ్రీవేల్పుగొండ యీశముకుందా॥ ౬౫

క॥ స్రక్చందనయుతవక్షా
ప్రాక్చరదేవేంద్రవిభవ(పరమపురుష) స
మ్యక్చరితమాధవ చతుర
వాక్చయ శ్రీవేల్పుగొండ వాసముకుందా॥ ౬౬

క॥ వేణుధర (ముష్టికాసుర
చాణూరకమల్లయుద్ధవిశారద) గోప
ప్రాణప్రద ఘననందక
పాణీ శ్రీవేల్పుగొండ భవనముకుందా॥ ౬౭

క॥ (సంసారవైరి) పురుషో
త్తంసా శృంగారజలజ దళలోచన స
ద్ధంసస్వరూపనిర్జిత
కంసా శ్రీవేల్పుగొండ కాంతముకుందా॥ ౬౮

క॥ సంసారభయవిదూరా
హంసాశ్వకరార్చితాంఘ్రి యఘదానవవి
ధ్వంసా క్రౌంచాసురహర
(కంసారీ) వేల్పుగొండ కాంతముకుందా॥ ౬౯

క॥ భీష్మప్రతాపధైర్య వి
శుష్మభుజారిహా (మురారి) శుక్వాపతమో
గ్రీష్మవిభాకరసన్నుత
భీష్మా శ్రీవేల్పుగొండ వేశ్మముకుందా॥ ౭౦

౧ వ్యాపకమైన చరిత్రగలవాడు.

# శ్రీ ముకుంద శతకము.

క॥ గరుడగమనభవభంజన !
సరసిజరుహ జనకలోక సంసారీశం ।
కరదురిత మోచనాహారి ।
(నరకాంతక) వేల్పుగొండ నాథముకుందా॥

క॥ అబ్రాజలోకపూజిత ।
సుబ్రాహ్మణపుత్రదాత శోభిత సద్మనా ।
దిబ్రహ్మచారి) సకలక।
౧కుబ్జాజిత వేల్పుగొండ కూటముకుందా ॥

క॥ సవ్యకనకాంబరాభర ।
ణావ్యక్తవిశాలవక్షు నాశరహిత (క్రి ।
ష్ణావ్యసనకశ్ఙా) పా ।
పవ్యయ శ్రీ వేల్పుగొండ భవనముకుందా॥

క॥ స్వచ్ఛంద భక్తభవకుటి ।
లాచ్ఛాదిత దోషజాల హరణదనుజరా ।
డ్వైచ్ఛేద్యక (శిశుపాల శి ।
రచ్ఛేత్తా వేల్పుగొండ రమణముకుందా॥

క॥ కాదేనహరనుతపద !
కా(దుర్యోధనకులాంతకా) మధురాంగా ।
కాదేనశయనపంకజ ।
పాదయుగళ వేల్పుగొండ భవనముకుందా ॥

క॥ ౨అవదాతముఖివిహా ।
భవనాశన ముంజికేశ పాండవమిత్రా ।
కువలయపా (విదురాక్రూ ।
రవరద) శ్రీ వేల్పుగొండరమణముకుందా॥

౧ చిక్కని కాశిత. ౨ గరుడవాహన.

క॥ నిర్మలపథసంచారా ।
ధర్మస్థా (విశ్వరూపదర్శక) విమలా ।
భర్మమయ చేలసేవక ।
శర్మద శ్రీవేల్పుగొండ శరణముకుందా ॥ ౭౭

క॥ నందసుత (సత్యవాక్) శ్రీ ।
కందర్ప సహస్రసదృశ కాయ మహాత్మా!
బృందారకసన్నుత గో ।
విందా శ్రీ వేల్పుగొండ వేశ్మముకుందా ॥ ౭౮

క॥ నిత్యానందమయాత్మక ।
సత్యవ్రతవినుత (సత్యసంకల్పా) యా ।
దిత్యజిత తేజభవరా ।
హిత్య శ్రీ వేల్పుగొండ యీశముకుందా ॥ ౭౯

క॥ జహ్నుసుతాబ్జాభయశా ।
వహ్నిద్యుతి తేజ(సత్యభామారత) శ్రీ ।
చిహ్నితవక్షసుధారస ।
౧నిహ్నవ వాగ్వేల్పుగొండ నిలయముకుందా ॥ ౮౦

క॥ మర్త్యావతార (జయి) హరి ।
మర్త్యులరక్షించిదనుజ మర్దనసేయన్ ।
మూర్త్యంతరములదాల్చితి ।
వార్త్యంతక వేల్పుగొండ హర్మ్యముకుందా ॥ ౮౧

క॥ క్షుద్రగుణరహితచరిత (సు ।
భద్రాపూర్వజ) పవిత్ర పార్థశరణ్యా ।
భద్రకరాకృతి క్షీరస ।
ముద్రనిలయ వేల్పుగొండ భూపముకుందా ॥ ౮౨

---

౧ నిరాకరణము.

క॥ పుణ్యజనాపహా (విష్ణు) హి।
రణ్యకశిపవక్ష భేద రమ్యగుణ(ప్రా।
వీణ్యాయదుకుల వృష్ణివ।
రేణ్యా(శ్రీ వేల్పుగొండ గృహపముకుందా॥ ౮౩

క॥ ఉష్ణకర తేజ (శ్రీయా।
ముష్ణికకారణద (భీష్మముక్తి(ప్రదదా)।
(గీష్మస్తురూపభవఘున।
భైష్మీధవ వేల్పుగొండ భవనముకుందా॥ ౮౪

క॥ సద్గతికై (బోవవె యు।
ష్మద్గుణ భోగ్యానుకూల జనులకిడవె సం।
పద్గమచరమార్గముల (జ।
గద్గురు) (శ్రీ వేల్పుగొండ కాంతముకుందా॥ ౮౫

క॥ గో(ప్రముఖార్భక సహితము।
వి(ప(ప్రమదార్పితాన్న విభవములను కృ।
ష్ణా(ప్రీతిఁగొను (జగన్నా।
థా) (ప్రాభవ వేల్పుగొండ ధామముకుందా॥ ౮౬

క॥ మారాంగ (వేణునాదవి।
శారద) కల్యాణరూప శాంతనపహృదా।
ధారకరుణావలోకన।
చారణనుత వేల్పుగొండ సదనముకుందా॥ ౮౭

క॥ సాధ్వసనంహారణా విమ।
లాధ్వరసర్వాధికార హరిహయనుత తా।
ర్క్ష్యధ్వజహారి (వృషభాసుర।
విధ్వంసీ) వేల్పుగొండ వేశ్మముకుందా॥ ౮౮

క॥ శ్రీబలవిక్రమగుణతిల |
కా (బాణాసురకరాంతకా) నయస్థైర్య |
ప్రాబల్యా రిపుసంహార |
ణా బాలక వేల్పుగొండ నాథముకుందా॥ ౮౯

క॥ సానందాభయదానసు |
ధీనాథ (యుధిష్ఠిర ప్రతిష్ఠాతా) భ |
క్తానుగ్రహామానసగిరి |
జానుతపద వేల్పుగొండ సదనముకుందా॥ ౯౦

క॥ భద్రకరగుణచరితనిరు |
పద్రవకర లోక(బర్హిబర్హావతంసా |
శూద్రధరవినుత యదుకుల |
భద్రాశ్రీ వేల్పుగొండ భవనముకుందా॥ ౯౧

క॥ స్వచ్ఛందాజాండకభ |
క్తేచ్ఛాప్రద (పార్థసారథీ) శ్రీస్తనస |
ద్గుచ్ఛాగసుప్తషట్పద |
కచ్ఛపతను వేల్పుగొండ కాంతముకుందా॥ ౯౨

క॥ (అవ్యక్తా) కరుణాకర |
భవ్యగుణామృతచరిత్ర పంకజనేత్రా |
హవ్యవహా వినుతవిజిత |
క్రవ్యాదా వేల్పుగొండ కాంతముకుందా॥ ౯౩

క॥ సాగరకన్యాహృద్వ |
రీ (గీతామృత మహోదధీ) గోపీసం |
భోగాహార్కమలపదనుత |
వాగీశా వేల్పుగొండ వాసముకుందా॥ ౯౪

క॥ కంజదళాయతలోచన ।
మంజుల (కాళీయఫణిసుమాణిక్యశ్రీ ।
రంజితపాదాంబుజ)ధృత ।
మంజీరా వేల్పుగొండ మాన్యముకుందా ॥ ౯౫

క॥ సామాగమవందితగుణ ।
కామక్రోధాదిలోభ కారణభేదా ।
రామామనోజసుందర ।
(దామోదర) వేల్పుగొండ ధామముకుందా॥ ౯౬

క॥ పాండవపంచప్రాణా ।
పండితరక్షణవిచార పాపవిదారా ।
౧దండివర యజ్ఞభోక్తా) ।
దండితరిపు వేల్పుగొండ ధామముకుందా ॥ ౯౭

క॥ క్లేశహర (దానవేంద్రవి ।
నాశక)సత్వప్రధాన నాగాధిపసం ।
వేశహర చాపభేదా ।
కేశవశ్రీవేల్పుగొండ గేహాముకుందా ॥ ౯౮

క॥ కుందముకుళ రదకిసలయ ।
సుందరరదనచ్ఛదావిశుద్ధకపోలా ।
కంధరతను (నారాయణ) ।
మంథరధర వేల్పుగొండ మాన్యముకుందా॥ ౯౯

క॥ శరణాగతావనాత్వ ।
చ్చరణనళినయుగళినమ్మ జనులుదరింపన్ ।
దరివైన(పరబ్రహ్మ) ।
కరుణాకర వేల్పుగొండ కాంతముకుందా॥ ౧౦౦

---

౧ దత్తాత్రేయావతారము.

క॥ నీహారకరసమస్మిత।
కాహళనిభజంఘయుగళ ఖచరనుతరమా।
మోహానను (పన్నగాశన।
వాహన) శ్రీవేల్పుగొండ వాసముకుందా॥ ౧౦౧

క॥ రాసానుగత (జలక్రీ।
డాసక్తసమస్తగోపికాంబర హరణా)।
వాసవసన్నుత మోక్షని।
వాసా శ్రీవేల్పుగొండ వాసముకుందా॥ ౧౦౨

క॥ పుష్పజనికుచగుళుచ్ఛక।
పుష్పంధయపుష్కరాక్ష(పుణ్యశ్లోకా)।
గీష్పతిసన్నుతయతసీ।
పుష్పనిభా వేల్పుగొండ భూషముకుందా॥ ౧౦౩

క॥ ౧పంచజనపంచవదనా।
పంచశరావయవ(తీర్థపాదా)బ్జనమ।
త్పంచజనాధారకభవ।
పంచయహార వేల్పుగొండ సద్మముకుందా॥ ౧౦౪

క॥ రాట్కరపూజితపదప్రా।
వృట్కాలాబ్దాభ(వేదవేద్యా)సంయు।
ద్విట్కాననహుతవహాపద।
రుట్కజ శ్రీవేల్పుగొండ రూఢముకుందా॥ ౧౦౫

క॥ ప్రాజ్ఞనగధైర్య(దయానిధి)।
ప్రజ్ఞకరవిరాజకంధ రసమగ్రసుధా।
౨రుజ్ఞవనకృతవదనజ।
ముజ్ఞిభతను వేల్పుగొండ భూషముకుందా॥ ౧౦౬

---

౧ నృసింహావతారము. ౨ స్తోత్రము.

క॥ అప్రాప్తమనోరథదర్శు ।
తిప్రియునిష్కలుష(సర్వతీర్థాత్మక)ల !
శ్రీమ్న ప్రాణాలోలసంభృత ।
౧విప్రవరా వేల్పుగొండ వేశ్మముకుందా॥ ౧౦౭

క॥ మోహాంధకారదూరా ।
సాహసవిక్రమగుణాఢ్య(సర్వగ్రహదూ ।
శ్రీహవ్యనాహ తేజా ।
౨కూహకహర వేల్పుగొండ కూటముకుందా॥ ౧౦౮

క॥ మంగళముగోపబాలక ।
మంగళము (పరాత్పరా) సుమమృదులవచనా ।
మంగళముమనుజసింహా ।
మంగళకర వేల్పుగొండ మాన్యముకుందా॥ ౧౦౯

క॥ తుష్టిగపద్యంబులక్క ।
ష్టాష్టోత్తరశతసునామ సమితినిసవరిం !
చిష్టతముకుందశతకము ।
సృష్టించితి వేల్పుగొండ శ్రీనరసింహా॥ ౧౧౦

మ॥ జలదాక్షిద్విరదాబ్జసంఖ్యగతమెచ్చన్ శాలివాహాబ్దవం ।
గలసన్మాధవశుద్ధషష్టి వెలసెన్నల్లంతిఘుల్ చక్రవ ।
ర్తులతంయాలకులాబ్ధిసత్కవలయాప్తుండైన లక్ష్మీనృసిం ।
హాలసన్నామకవీంద్రనిర్మితముకుందాఖ్యన్ ప్రసిద్ధంబుగన్॥

శ్రీ ముకుందశతకము

సంపూర్ణము.

---

౧ గరుడుడు. ౨ వేదబాహ్యులు.

ఆ యి నా మ ము.

వేల్పు గొండన్నృహరి పాదములు - మమ్ము - విమవకరక్షిం చుపాదములు - వేల్పులు నెల్లసేవింపనగ న్యుండు - సల్పిపూజించినపాదములు॥ వే॥ కలితప్రభావవిచ్ఛేదములు - మహా - బలిశీర్షవిన్యస్తపాదములు - పలసితగజసింహ వృషభశార్దూలపుష్కలగతులజూపించుపాదములు ॥ వే॥ అపహృతకృష్ణార్తి ఖేదములు - బ్రహ్మ - స్వపదప్రక్షాళితపాదములు - రపణముగనుచతుర్దశభువనంబులు - విపులముగను గొల్చు పాదములు ॥ వే॥ సురభక్తపాప ప్రభేదాములు - భూమీ - సురనుతిసంసక్తపాదములు - తరుగుల్మవల్ల్యాదిస్థిరచరములకును - పరమపదము నొసగుపాదములు ॥ వే॥ గోపికాగోపసమ్మోదములు - సర్వ - గోప్యస్థితంబైనపాదములు - శాపానుగతశిలరూపు జెరచియోషి - ద్రూపము నొందించుపాదములు ॥ వే॥ ప్రహ్లాదహృత్పుష్పప్రసాదములు రక్త - పద్మసన్నిభమైనపాదములు - ఆహ్లాదదరకల్పకాంకుశవజ్రధ్వ - జాహ్లాదచక్రస్థపాదములు ॥ వే॥ జలసుక్షాళితభవశాదములు - మాకు - కులదైవమైయున్నపాదములు - అలశకరాక్షసులనలయించిభక్తుల - దలలభూషలునైనపాదములు ॥ వే॥ దనుజపచిత్తవిషాదములు - బృందా - వనభూమిచిహ్నితపాదములు - చనువిగురొత్తమానరవెల్లిరూపము - మనుజోత్తముని సేయుపాదములు॥ వే॥ మోహాదిమాయావిచ్ఛేదములు - కాళి - యాహిఫణాంచితపాదములు - ద్రోహాదికపట సందోహు శకటాసుర - దేహముహరియించుపాదములు॥ వే॥ శేష శేషాశనశ్రీదములు - విపవి - శేషవక్షాంకితపాదములు - భూషితపాదుకాసారసమీపసం - పుల్లాబ్జవేష్టితపాదములు॥ వే॥ లక్ష్మీహృద్వీధివినోదములు - శ్రీవి - లక్షణాత్మోత్తరణపాదములు - లక్ష్మణగురుచంద్ర లాలితోక్తులచేత - సాక్షాత్కరించినపాదములు ॥ వే॥౧౧॥

# ప్రకటన.

## శ్రీరామ పాదుకా పట్టాభిషేకము.

—* కంపెని డ్రామా *—

ఇయ్యది శ్రీమాన్ నల్లంతిఘుల్ చక్రవర్తుల రంగ లక్ష్మీనృసింహార్య కవినాధునిచే రచియింపఁబడి ప్రదర త్యంతోపకారంబై రసవంతంబైన పద్యంబులతో సమ ర్చబడి మ॥ రా॥ బెలిదె నరసయ్యగారి సహాయమ వచ్చు వేయబడుచున్నది యెల్లరకు తెలివిడికొరకు విశద నైనది.

## శ్రీ రామానుజసూక్తి వార్తారత్నమా

ఇయ్యది శ్రీమాన్ ముప్పాల రామచంద్రసూరిగారిచే రచియింపఁబ తొల్లి శ్రీమదనంతాంశసంభూతులగు భగవద్రామానుజమునీంద్రులు సకల లిహపరంబులయందుజ్జీవించి సుఖించుకొరకు వుపదేశించిన యెనుబదిరెం ర్తలు, ప్రపన్న జనులకు స్మరణ ధ్యానానుకూలమగు ముద్దులు మూటగట్టి క్కని పద్యములు గ్లేజు కాగితములపై శ్రీరామానుజులవారి ఛాయా పట ముద్రింపబడినది.

దీని వెల ౦—౮—౦.

వలయువారు:—

గరిమెళ్ల చంద్రయ్యగారి

వెంకటకృష్ణయ్యసూరి.

జనరల్ మర్చెంట్ అండ్ బుక్కుసె

వరం